శ్రీరస్తు.

# మాధ్వవిజ్ఞాపనము




ఇది

గంజాంజిల్లా బరంపురం సబ్ రెజిష్ట్రారుగానుండి

ప్రస్తుతము శెలవుపైనున్న




చిల్లరిగె వెంకటలక్ష్మీనృసింహముచే

వ్రాయబడినది.



మొదటికూర్పు 500.

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు

శాస్త్రి చినసూర్యారావుచే ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచే ప్రచురింపఁబడియె.

1913.

గ్రంథపరిశ్రమ చేయుటలో పూర్వులకు కలిగిన సాధనములేకాక ఇతరదేశము లయొక్కయు, ఇతరభాషలయొక్కయు, క్రొత్తగా కనుగొనబడిన శాసనములు, నాణె ములు మొదలగువాని యొక్కయు, చరిత్రలవలన క్రొన్ని విశేషసాధనము లిప్పుడు కలిగి నందున ప్రాచీనచర్చలకును నవీనచర్చలకును వ్యత్యాసములుకలిగి భిన్నాభిప్రాయ ములు కలుగుచుండుట యనివార్యము, ఈనవీనచర్చల నిదర్శనముల్ విజ్ఞాపనముయొ క్క యనుబంధములలో కొంతవరకు తెలియచేయ బడినవి!—సహనమువలనను, సమన్వ యమువలనను కలుగులాభముకేవల వాదమువలన కలుగ నేరదనుట యనుభవసిద్ధము.

సుందరేషు సురమందిరబృందే
ష్వింది రారమణవందనకృత్యం...... (మధ్వవిజయం 6 సర్గ)

ఇతరదేవతల యాలయములందు విష్ణువునే మధ్వాచార్యులు నమస్కరించుటయు శ్రీరంగము మొదలగు క్షేత్రములకు మధ్వాచార్యులు వెళ్ళినను అక్కడి పూజావిధాన ము మధ్వసిద్ధాంతాను సారముగా నుండకపోవుటయు, అంతమాత్రమున మాధ్వులకా క్షేత్రములయందు గౌరవలోపము కలుగకుండుటయు, మాధ్వులు పూజచేయు దేవాల యములందితర మతస్థులకు గౌరవముండుటయు, తురుష్కులతో మధ్వాచార్యులు (మ్లే చ్ఛభాషయగు) తురుష్కభాషతోనే మాటలాడిరని మధ్వవిజయము చెప్పుటయు, నీస హనమునకు, సమన్వయమునకు నిదర్శనములై యున్నవి. ఇట్టిసమన్వయభావమును జ్ఞా పకముచేసి గ్రంథపరిశ్రమకు కొంచెమైననీ "విజ్ఞాపనము" ప్రోత్సాహకరమైనయెడ ల నేను కృతకృత్యుడ నగుదును.

మధ్వాచార్యులవారి గ్రంథములను స్మరించినపుడు జయతీర్థాచార్యులవారిని స్మరించకతప్పదు. వీరిటీకలు లేని మొదల భాష్యాది గ్రంథములు తెలియుట దుస్సా ధ్యము. ఈటీకాచార్యులవారి క్లిష్టశ్లోకములాలను గా వినయభావమును తెలియచేయుచుం డగావారి వినయోక్తినావిషయమై స్వభావోక్తి యగునేను మధ్వగ్రంథములను గురిం చి వ్రాయుట సాహసకృత్యము. అయినను, "ఉడుతభక్తి" వలె కొంతపని చేయుట మంచిదని సాహసించితిని. సిద్ధాంతములోని ముఖ్యాంశములను, ఇందుపై వివిధాభిప్రా యముల నొకచోట సాధ్యమైనంతవరకు చేర్చుటయే నేను చేసినపని.

న్నైవేమస్యభ్రాంత్యానచనచనచాతుర్యకుధియా
సమాత్సర్యావేశాన్నచచపలతాదోషవశతః
పరంశ్రద్ధాజాడ్యాదకృషికృతిమాచార్యవచసి
స్ఖలన్త్యైతస్మాజ్జగతిసహేస్సంద్యోస్మివిదుషాం॥

కాకినాడ,
మాధ్వపాఠశాల,
3 సెప్టెంబరు 1913.

చిల్లరిగె వేంకటలక్ష్మీనృసింహాం

# ఓమ్

# మాధ్వవిజ్ఞాపనము.

నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తారమవతు । అవతు మాం । అవతు వక్తారం । ఓం శాంతిః । శాంతిః । శాంతిః॥

నిజపూర్ణసుఖామితబోధతనుః పరశక్తిరనంతగుణః పరమః
అజరామరణః సకలార్తిహరః కమలాపతిరీడ్యతమోఽవతు నః॥

మాతర్మే మాతరిశ్వన్ పితరతులగురో భ్రాతరిష్టాప్తబంధో
స్వామిన్ సర్వాంతరాత్మన్నజరజరయితర్జన్మమృత్యామయానాం
గోవిందే దేహి భక్తిం భవతి చ భగవన్నూర్జితాం నిర్నిమిత్తాం
నిర్వ్యాజాం నిశ్చలాం సద్గుణగణబృహతీం శాశ్వతీమాశు దేవ॥

భాష్యాణాం దశకం చ పంచకయుతం త్రిస్త్రశ్చ నిర్ణీతయో
విష్ణుస్తోత్రయుగం దశప్రకరణం కల్పద్వయం చ స్మృతిః
శ్రీకృష్ణామృతతంత్రసార యమకన్యాయావళీదీపనం
యేనాకారి స ఏవ మధ్వమునిరాడ్దద్యాత్సువిద్యాం మమ॥

శ్రీమన్మధ్వమతే హరిః పరతరః సత్యం జగత్తత్త్వతో
భిన్నా జీవగణా హరేరనుచరా నీచోచ్చభావంగతాః
ముక్తిర్నైజసుఖానుభూతి రమలాభక్తిశ్చ తత్సాధనం
హ్యక్షాదిత్రితయం ప్రమాణమఖిలామ్నాయైకవేద్యో హరిః॥

విష్ణువు సర్వోత్తముడు, జగత్తు యథార్థముగా సత్యము (కాని వ్యావహారికసత్యము మాత్రమే కాదు) జీవులు భిన్నులు, విష్ణుసేవకులు, తారతమ్యము కలవారు. ముక్తి యనునది (జీవుని) నిజస్వరూపానందానుభవము. ఇట్టి ముక్తికి నిర్మలమయిన భక్తి సాధనము. ప్రత్యక్షము, అనుమానము, శబ్దమునను మూడును ప్రమాణములు. అన్నిశాస్త్రములచేతను ముఖ్యముగా తెలియబడ తగినవాడు విష్ణువు. ఇది సంగ్రహముగా మధ్వసిద్ధాంతము.

ఈసిద్ధాంతము నేర్పరచుటకు మధ్వాచార్యులవారు భాష్యాదులగు ముప్పదిరెండు గ్రంథములరచించిరి. అవియేవి యనిన:—

1. గీతాభాష్యం.
2. గీతా తాత్పర్య నిర్ణయం.
3. బ్రహ్మసూత్ర భాష్యం.
4. ,, అణుభాష్యం.
5. ,, అనువ్యాఖ్యానం.
6. ,, న్యాయవివరణం.
7. ఐతరేయ.
8. తైత్తిరీయ.
9. బృహదారణ్య.
10. ఈశావాస్య.
11. కాఠక.
12. ఛాందోగ్య.
13. ఆథర్వణ.
14. మాండూక.
15. షట్ప్రశ్న.
16. తలవకారక.

(7–16) (10) ఉపనిషద్భాష్యములు.

17. ఋగ్భాష్యం.
18. ప్రమాణలక్షణం.
19. కథాలక్షణం.
20. ఉపాధిఖండనం.
21. మాయావాదఖండనం.
22. మిథ్యాత్వానుమానఖండనం.
23. తత్త్వసంఖ్యానం.
24. తత్త్వవివేకం.
25. తత్త్వోద్యోతం.
26. కర్మనిర్ణయం.
27. విష్ణుతత్త్వనిర్ణయం.

(18–27) (10) ప్రకరణములు.

28. నరసింహనఖస్తోత్రం.
29. ద్వాదశస్తోత్రం.
30. కృష్ణామృతమహార్ణవం.
31. తంత్రసారసంగ్రహం,
32. సదాచారస్మృతి.

33. యతిప్రణవకల్పం.
34. కృష్ణజయంతీనిర్ణయం.
35. యమకభారతం. *
36. మహాభారతతాత్పర్యనిర్ణయం.
37. భాగవతతాత్పర్యనిర్ణయం.

ఈగ్రంథములు ద్వైతసిద్ధాంతమును తెలియచేయుటయేకాక షడ్దర్శన, శ్రుతి, స్మృతిఇతిహాస, పురాణ, తంత్రములలోనియంశములనుసాహిత్యమును తెలియచేయుటకును పయోగకముగానున్నవి. షడ్దర్శనములలోని సాంఖ్యయోగములు గీతాభాష్య, గీతాతాత్పర్య, భాగవతతాత్పర్య, తంత్రసారసంగ్రహములలోను, న్యాయవైశేషికములు పదిప్రకరణములలోను, పూర్వమీమాంస కర్మనిర్ణయమను ప్రకరణములోను, ఉత్తరమీమాంస బ్రహ్మసూత్రభాష్యములలోను చెప్పబడినవి. ఋగ్భాష్యములోను ఉపనిషద్భాష్యములలోను శ్రుత్యర్థము చెప్పబడినది. సదాచారస్మృతి, యతిప్రణవకల్పములును స్మృత్యర్థమును సూచించును. యమకభారత, మహాభారతనిర్ణయ, భాగవతనిర్ణయములలోని తిహాసపురాణములలోని సంగతులు చెప్పబడినవి. ఇందులో మొదటి రెండు గ్రంధములు సాహిత్యమునకుపయోగముగానున్నవి. మంత్రశాస్త్రము, దేవాలయప్రతిష్ఠ, ప్రతిమాప్రతిష్ఠ మొదలగు నంశములు తంత్రసారసంగ్రహములో చెప్పబడినవి. గనుక మాధ్వగ్రంథముల చదివిన సమస్తశాస్త్రములను చదివిన లాభము కలుగును.

ఈగ్రంథములన్నియు కొంతకాలము క్రిందటివరకు రహస్యగ్రంథములుగానుండి పండితులకుమాత్రమే లభ్యములయి తక్కినవారికి సులభసాధ్యములు కాక యుండెను. ఇటీవల మధ్వసిద్ధాంతోన్నాహినీసభయొక్క ప్రోత్సాహమువలన మధ్వమతమునకు లభించిన వ్యాప్తివలన ఈగ్రంథములు ముద్రింపబడి వెల్లడిచేయబడినందున నివి జనసామాన్యమునకు సులభలభ్యములయినవి. మతచర్చాసభయొక్క రిపోర్టులలో ప్రచురింపబడుచున్నవి. మాధ్వగ్రంథము లితరభాషలలోకి వినిమయములుకూడ చేయబడుచున్నవి.

మధ్వభాష్యానుసారముగ, బ్రహ్మసూత్రములకును భగవద్గీతలకును మ. యస్. సుబ్బారావుగారిచేతను, ఉపనిషత్తులకు రాయబహద్దరు శ్రీశచంద్రవాసుగారిచేతను, ఆంగ్లేయ భాషలో వినిమయములు వ్రాయబడినవి. ఇందువలన గ్రంథములకు పూర్వపురహస్యత్వము పోయి ప్రకాశతవచ్చి, నవీనుల చర్చావిమర్శనములకు కూడ నవకాశము కలిగినందున సంప్రదాయ సిద్ధములగు విశ్వాసములకు కొంతమార్పు కలుగుట సంభవించుచున్నది. ఈచర్చావిమర్శనములకు నిదర్శనములిక్రింద వివరింపబడినవి.

మ॥ సుబ్బారావుగారు నవీనుల యభిప్రాయములను సూచించుచు వానిని కొంతవరకు ఖండించుటకు ప్రయత్నము చేసిరి. (1 అనుబంధముచూడుడు) షడ్దర్శనములు బుద్ధునికి పూర్వముండినటుల నొప్పికొనకపోయినను బౌద్ధమతక్షీణతకు పూర్వమైన నుండెననుటకు సందేహముండదని వీరువ్రాసిరి. కాని షడ్దర్శనములు బుద్ధునికి పూర్వముండినటుల వీరు స్పష్టపరుపలేదు.

షడ్దర్శనములోనివగు బ్రహ్మసూత్రములు భగవద్గీతలలో "బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః" (13·4) అని యుదహరించబడినటుల వీరి యభిప్రాయముగాను స్నందున బ్రహ్మసూత్రముల తరువాత భగవద్గీతలు వ్రాయబడినటుల స్పష్టమగును. బ్రహ్మసూత్రములు బుద్ధుని తరువాత వ్రాయబడిన యెడల వాని తరువాత వచ్చిన భగవద్గీతలు బౌద్ధమతము తరువాతనే వ్రాయబడి యుండవలెను.

మధ్వాచార్యులవారి సిద్ధాంతము సర్వదర్శన సంగ్రహములో చేర్చబడునంత ప్రాముఖ్యత చెందుట కధమము రెండువందల సంవత్సరములైనను కావలసి యుండవలయునని వీరువ్రాసిరి. అట్టిస్థితిలో, బ్రహ్మసూత్రములు ప్రమాణముగా ఎంచబడి భగవద్గీతలలో వ్రాయబడుటకంత కాలమైనను కావలసియుండవలెను.

పైఅభిప్రాయాను సారముగ బ్రహ్మసూత్రముల తరువాత భగవద్గీతలు వ్రాయబడినయెడల, బ్రహ్మసూత్రములలోని "స్మృతేశ్చ" మొదలగు స్మృతివాక్యములకుభగవద్గీతలోని వాక్యములాధారముగ భాష్యము లోవ్రాయుట విరుద్ధముగానుండును. బ్రహ్మసూత్రముల తరువాత వ్రాయబడిన భగద్గీతలు బ్రహ్మసూత్రములకు ప్రమాణమగుట యసంభవము.

భారతము రచించబడిన కాలమందే దానిలో భగద్గీతలుండెనని వీరియభిప్రాయమును తెలియచేయుచు ఇప్పుడున్న భారతము సరిఅయినదికాదని తాత్పర్య నిర్ణయములోని వాక్యములను వీరుదహరించిరి. ఇందువలన, భారతము మూడుమారులు సవరణచేయబడినదనియు, మొదట "జయ" మనుపేరుతో యుద్ధచరిత్రముసే ఈగ్రంథము కలిగి యుండెననియు, రెండవ సవరణలో "భారత"మనుపేరును,మూడవసరణలో "మహాభారత" మనుపేరును ఈగ్రంథమునకు వచ్చెననియు చెప్పునవీనులయభిప్రాయముకొంతబలము కలుగుచున్నది.

అధర్వణ సంహిత తక్కినవేదములకన్న వెనుకవచ్చినదని నవీనులైనను స్థిరపరుచలేకపోయిరని వీరువ్రాసిరి. "ఏకో వేదః కృతేహ్యాసీ త్త్రేతాయాం స త్రిధాభవత్ సఏవ పంచధా జాతో ద్వాపరం ప్రాప్యకై యుగం" కృతయుగమందొక వేదమేయుండెను

త్రేతాయుగమందది మూడువిధములయినది. ద్వాపరమందు అయిదువిధములయినది. అనఁ అధర్వణ భాష్యములోని ప్రమాణమునవీనులకు బలముగా నున్నటుల కనబడుచున్నది; త్రేతాయుగమందు "త్రయీ" అను పేరుతో ఋగ్యజుస్సామవేదములే యున్నం దుం డల అధర్వణవేదము తరువాత వచ్చినటు కనుబడును.

వేదములోని మంత్రబ్రాహ్మణ, ఉపనిషద్భాగములు వివిధ కాలములలో వ్రాయ డినటుల నొకవేళ నొప్పుకొన్నను వానిలోని యభిప్రాయము పరంపరగా నొకరీతినివచ్చు చున్నదనివీరువ్రాసిరి. వివిధకాలములలో వ్రాయబడినటుల నొప్పుకొనుటకుకాని, యొప్పుకొ నక పోవుటకుకాని వీరికారణములను తెలియచేయలేదు. అందరికి సులభముగా తెలియుటకొ రకుమధ్వాచార్యులవారు ఋగ్వేదసంహితలోనిప్రమాణముల నే కూడ హరించిరికాని యంత కుపూర్వపుగ్రంథములనుంచిప్రమాణములను వ్రాయలేదని వీరువ్రాయుటవలన ననాదియని చెప్పబడు ఋగ్వేదముకన్న ప్రాచీన గ్రంథముండుట విషయమయి సంశయము కలుగును

మధ్వాచార్యులవారి జననకాలము శాలివాహనశకము 1025 లేక 1029 సంవత్సర ములయినటుల వీరు స్థిరపరచిరి. (ఇప్పుడు శా,శ, 1835 సం॥) గనుక మధ్వా చార్యులు వారిప్పటికి సుమారు 810 సంవత్సరముల క్రిందట జన్మించినటుల తేలును. మహాభారత తాత్పర్యనిర్ణయమందు.

" చతుఃసహస్రే త్రిశతోత్తరే గతే సంవత్సరాణాంచకలౌ పృథివ్యాం
జాతః పునర్విప్రతనుః సభీమో దైత్యైర్నిగూఢం హరితత్త్వమాహ"

"త్రైమితసుర్మ రుతఆహకథాంపరస్య" యనియునుకలియుగమందు 4300 సంవత్స రములయిన తరువాత భీముడు బ్రాహ్మణుడై పుట్టెననియు, ఆభీముని శరీరమే తమదనియు ను, మధ్వాచార్యులు వ్రాసినందున, (ఇప్పుడుకలియుగము 5014 సం॥ గనుక) ఇప్పటికి 714 సంవత్సరములక్రిందట వారిజన్మ మయినటుల వారు స్వయముగా వ్రాసినటుల స్పష్ట మగును. ఉత్తరాదిమఠములోని చరిత్రనుపట్టి మ॥ సుబ్బారావుగారేర్పచిన కాలమునకు నాచార్యులు తారు నిర్ణయములో వ్రాసినకాలమునకును సుమారు 96 సంవత్సరముల వ్య త్యాసము కనబడుచున్నది.

జయతీర్థస్వాములవారు విద్యారణ్యస్వాములవారికన్న చాల పూర్వపువారని వీరు వ్రాసిరి. విద్యారణ్యస్వాములవారు జయతీర్థస్వాములవారి గురువైన అక్షోభ్యతీ ర్థస్వాములవారితోను, తరువాత జయతీర్థస్వాములవారితో కూడ వాదించినటుల జ యతీర్థ విషయములో వ్రాయబడినది. "అసినాతత్త్వమసినా పరజీవప్రభేదినా విద్యా

ణ్యామహా రణ్యామక్షోభ్యముని రచ్చినత్" అను పారంపర్యాయముగా వచ్చుశ్లోకమువలన జయతీర్థులగురువైన అక్షోభ్యతీర్థులు వారికాలముననే విద్యారణ్య స్వాములున్నట్టు కనబడు నప్పుడు విద్యారణ్యులకన్న చాలపూర్వమందే జయతీర్థుల వారుండుట యసంభవము.

నరహరి తీర్థులు మధ్వాచార్యుల వారి రెండవశిష్యుడయి వారి కాలీయుడగుట వలన నతని వ్యాఖ్యానము మధ్వాచార్యులవారి యభిప్రాయము ననుసరించి యుండవలెను. అట్టివ్యాఖ్యానమును కొన్నిచోట్లను వారి తరువాత చాలకాలమునకు వచ్చిన జయతీర్థులు తప్పుపట్టినటుల వ్రాయుటవలన మధ్వాచార్యులవారి నిజమయిన యభిప్రాయమును గురించి సందేహము కలుగును. కొన్నివందల సంవత్సరముల క్రిందట జరిగిన మధ్వాచార్యులవారి జన్మకాలము గురించియు వారి యభిప్రాయమునుగురించియు వారితరువాత వారికాలమును గురించియు, సందేహము కవకాశము కలుగు చున్నపుడు వేలకొలది సంవత్సరముల క్రింద వ్రాయబడినటుల చెప్పబడు భగవద్గీత గురించియు దాని యభిప్రాయమునుగురించియు సందేహము కలుగుట యొకవింతకాదు.

ఇట్టిసందేహములను, మాధ్వుల సంఖ్య యల్పముగా నుండుటకును, మాధ్వగ్రంథములు తక్కిన మతగ్రంథములవలె వెల్లడికాక పోవుటకును, కారణములను మ॥ సుబ్బారావుగారు చర్చించి వ్రాసిన యెడల మాధ్వుల కుపయోగముగా నుండును.

ఇకను మాధ్వులు కానివారు వ్రాసినయంశముల నాలోచింతము. శ్రీశచంద్ర వాసుగారు పనిషత్తులలో నీశావాస్యము మొదటిదయి యుండవచ్చుననుట వలన వేదభాగములు వివిధకాలములో వ్రాయబడినవనునవీనుల యభిప్రాయమునకు బలముకలుగుచున్నది.

బ్రహ్మసారమను గ్రంథ మెక్కడను లేదనియును అదిమధ్వాచార్యులవారిచే రచించబడినది కానియెడల మధ్వసిద్ధాంతమున కాధారములు మధ్వాచార్యులువారికి పూర్వమేయుండియుండవలయునని వీరువ్రాయుటవలన మధ్వాచార్యులవారి ప్రమాణగ్రంథములు యాథార్థ్యముగురించి సందేహముకలుగును.

గౌడపాదకారికలను మాండూక్యోపనిషత్తుతో కలిపి మధ్వాచార్యులవారు చదివిరని చెప్పుటవలన నిజమయిన యుపనిషద్భాగముగురించి సంశయముకలుగును. వాయుపురోక్త జీవోత్తమత్వమును గురించి వీరువ్రాసిన యంశములు క్రీస్తుమతసిద్ధాంతమును సూచించుచున్నవి. (2 అనుబంధముచూడుడు)

మహాభారతములోని కృష్ణుడును, భాగవతాది పురాణములలోని కృష్ణుడునువేరుపురుషులని స్థిరపరుచుటకు మధ్వాచార్యులువారి ఛాందోగ్యోపనిషద్భాష్యములోనివాక్యములు ప్రమాణముగా తీయబడినవి. క్రీస్తవమత సంపర్కమిందులో సూచించబడినది.

(3 అనుబంధము చూడుడు)

వాయువుద్వారాతప్ప ముక్తిలేదను సిద్ధాంత మెక్కడనుంచివచ్చినది చెప్పలేము. నిము॥ సి. యస్. క్రిష్ణస్వామిఅయ్యరు వ్రాసిరి. (4 అనుబంధముచూడుడు)

బౌద్ధమత సంపర్కములేని శుద్ధార్యమతమును మధ్వాచార్యులు స్థాపించిరని సుబ్బారావుగారి యభిప్రాయము. క్రీస్తుమతసంబంధమయిన కొన్నియంశములు మధ్వసిద్ధాంతములో కలిసినవని తక్కవారి సూచితాభిప్రాయము.

ఇట్టిచర్చలకవకాశమిచ్చు నీకాలములో కేవల గురువాక్య విశ్వాసము చేతనే మాధ్వగ్రంధములను గౌరవించువా రల్పసంఖ్యాకులుగా నుందురు. గనుక నీగ్రంథములందరికి నెటుల లాభకరములగునో యను యంశమును విచారించుట ముఖ్యకృత్యము. ఈ విచారణకు పూర్వముమనల నితరు లెటులచూతురో తెలిసికొనుటయావశ్యకముగనుక మాధ్వగ్రంథములలోని కొన్నియంశములను ఆక్షేపగ్రస్తములు, సమ్మతియోగ్యములు, శ్లాఘనీయములు నను మూడు శీర్షికలక్రింద వివరింతము. ఆక్షేపగ్రస్తములనగా నితరులచే నాక్షేపింపబడునవి. సమ్మతియోగ్యము లనగా నితరు లొప్పికొనకపోయినను ఆక్షేపించనివి. శ్లాఘనీయము లనగా నితరులచేనైన కొనియాడబడ తగినవి.

## ఆక్షేపగ్రస్తములు.

(మహాభారత తాత్పర్య నిర్ణయములోనివి)

అసురాణాం తమఃప్రాప్తి సదానియమతో భవేత్
యదాతుజ్ఞానిసద్భావే నైవగృహ్ణంతి తత్పరం॥ (I-91)

(ఉపదేశముచేయతగిన) జ్ఞాని లభించినపుడతని యుపదేశము నెవ్వరువినరో అపుడే అసురులకు తమఃప్రాప్తియగును.

ఈతమఃప్రాప్తియొక్క స్వరూప మీక్రింద తెలియచేయబడినది:—

పూర్ణదుఃఖాత్మకో ద్వేషః సోనంతో హ్యావతిష్ఠతే।
పతితానాంతమస్యంధేని శ్శేషసుఖవర్జితే॥ (I-112)

అంధతమస్సునందు సుఖమెంతమాత్రములేదు. అట్టితమస్సులోపడినవారికి దుఃఖపూర్ణమగునటుల ద్వేషముండును. (ఇదినిత్యనరక సిద్ధాంతమును తెలియచేయును. ఈసిద్ధాంతమును తక్కనహిందువులెవరు నంగీకరించలేదు. క్రీస్తుయొక్కబోధ నంగీకరించనివారందరు శాశ్వతనరకమున బడుదురను క్రైస్తవసిద్ధాంతమునిదిపోలియున్నదని కొందరియభిప్రాయము)

ద్వేషస్వరూప మీక్రింద తెలియచేయ బడినది:—

జీవాభేదో నిర్గుణత్వ మపూర్ణగుణతా తథా
సామ్యాధిక్యే తదన్యేషాం భేద స్తద్గత ఏవచ॥
ప్రాదుర్భావవిపర్యాస స్తద్భక్త ద్వేష ఏవచ
తత్ప్రమాణస్య నిందాచ ద్వేషా ఏతేఖిలా మతాః॥
ఏతైర్విహీనా యాభక్తి స్సాభక్తి రితినిశ్చితా॥ (I-113,115)

(విష్ణువుకు) జీవులతో అభేదము, నిర్గుణత్వము, పూర్ణగుణాభావము, తక్కిన వారితో సమత్వము, లేక వారికంటె న్యూనత, విష్ణుస్వరూపములలో భేదము, ప్రాదుర్భావ విపర్యాసము, విష్ణుభక్తులయందలి ద్వేషము, వారి ప్రమాణములనింద, ఇవియన్నియును ద్వేషములుగా నెంచబడును. ఇట్టిద్వేషములతో కూడని భక్తియే భక్తియని నిశ్చయించ బడినది. (ఇందులో విష్ణుభక్తుల యందలి ద్వేషము వారి ప్రమాణములనిందయు నునవితప్ప తక్కినవి అభిప్రాయ భేదములు కావచ్చును కాని ద్వేషలక్షణము లనిన నితరులా క్షేపింతురు.)

ప్రాదుర్భావ విపర్యాసమెట్టిదో యీక్రింద వివరించబడినది:—

అవతారాణాం హరేర్జ్ఞానా త్వానావతారాహరేశ్చయే
తదావేశాం స్తథా సమ్యక్ జ్ఞాత్వా ముక్తిర్న చాన్యథా॥ (I-83)

విష్ణువుయొక్క యవతారములను, అవతారములు కాని వానిని అంశావతారములను బాగుగ తెలిసిననే ముక్తి కలుగును. లేనియెడల కలుగదు. (ఇందువలన మధ్వసిద్ధాంతానుసారముగ పూర్ణావతారములగు పరశురామ వ్యాసావతారములను అంశావతారములుగా భావించు ఇతర మతస్థులకు ముక్తి లేదనిన వారాక్షేపింతురు. అవతార సిద్ధాంతము బౌద్ధమతము వచ్చినతరువాత కల్పించ బడినదనినమ్మునవీనులకిది మిక్కిలి యాక్షేపణీయము.)

తస్యాంగం ప్రథమో వాయుః ప్రాదుర్భావత్రయాన్వితః
ప్రథమో హనుమాన్నామ ద్వితీయో భీమ ఏవచ
పూర్ణప్రజ్ఞ స్తృతీయస్తు భగవత్కార్యసాధకః॥ (II-127)

భగవత్సేవలో మొదటి సాధకుడు వాయువు. అతనికి మూడవతారములు (1) హనుమంతుడు (2) భీముడు (3) పూర్ణప్రజ్ఞుడు (అనగా మధ్వాచార్యులు). (పై యవతార సిద్ధాంతమునకువచ్చిన యాక్షేపణమే దీనికినివచ్చును.)

పైమూడవతారములకు ప్రమాణముగా చెప్పబడిన ఈక్రింది ఋగ్వేదమంత్రములు వాయూపరముగా వ్యాఖ్యానముచేయబడినవి:—

బళిత్థాతద్వపుషేధాయిదర్శతం దేవస్యభర్గస్సహసోయతోజని
యదీముపహ్వరతేసాధదేమతిర్ఋతస్యధేనాఅనయంతసస్రుతః
పృక్షోవపుఃపితుమాన్నిత్యఆశయే ద్వితీయమాస ప్తశివాసుమాతృషు
తృతీయమస్యవృషభస్యదోహసేదశప్రమతింజనయంతయోషణః॥

(II 154-155)

ఈమంత్రము లగ్నిపరముగా విద్యారణ్య భాష్యములో వ్రాయబడినవి. అందులో నవతార ప్రమేయ మేమియును లేదు. ఈమంత్రార్థము విషయమై సుమారు 25 సంవత్సరములక్రిందట మధ్వసిద్ధాంతోన్నాహినీ రిపోర్టులలో వాదములు ప్రచురింపబడినవి. ఈమంత్రములు వాయుపరము కావనియు, యాస్కనిరుక్తముకు విరుద్ధముగా మాధ్వభాష్యమున్నదనియు నద్వైతులాక్షేపించిరి.

## సమ్మతి యోగ్యములు.

(మహాభారత తాత్పర్య నిర్ణయములో)

సామ్యంనచాస్యపరమేణచకేనచాప్యం
ముక్తానచక్వచిదతస్త్వభిదాకుతోస్య
ప్రాప్యేతచేతనగణైః సతతాస్వతంత్రై
ర్నిత్యస్వతంత్రవపుషః పరమాత్పరస్య॥ (I. 21)

భగవంతునితో నెవనికిని ముక్తియందైనను సామ్యము లేదు. నిత్యస్వతంత్రుడును, పరాత్పరుడు నగు భగవంతునికిని కేవలమస్వతంత్రులగు చేతనులకు నభేదమెటుల కలుగును.?

జగత్ప్రవాహస్సత్యోయంపంచభేదసమన్వితః॥ (I. 69)

(1) జీవునికి నీశ్వరునకు భేదము (2) జీవులలో పరస్పర భేదము (3) జీవునకు జడముకు భేదము (4) జడముకు నీశ్వరునికి భేదము (5) జడములలో పరస్పరభేదము, ననునీయయిదు భేదములతో గూడిన జగత్ప్రవాహము సత్యము.

విష్ణుర్హిదాతామోక్షస్యవాయుశ్చతదనుజ్ఞయా
మోక్షోజ్ఞానంచక్రమశోముక్తిగోభోగఏవచ॥

ఉత్తరేషాం ప్రసాదేన నీచానాం నాన్యథా భవేత్।
సర్వేషాం చ హరిర్నిత్యం నియంతా తద్వశాః పరే॥
తారతమ్యం తతో జ్ఞేయం సర్వోచ్చత్వం హరేస్తథా॥ (I. 79-81)

మోక్షమునిచ్చువాడు విష్ణువు అతనియాజ్ఞవలన వాయువు మోక్షమునిచ్చును. మోక్షము, జ్ఞానము, ముక్తియందలి భోగమును తక్కినవారికి తమకన్న గొప్పవారి యనుగ్రహమువలన క్రమముగా వచ్చును. అందరికిని విష్ణువు నియామకుడు. తక్కినవారతని వశవర్తులు, గనుక తారతమ్యమును, విష్ణుసర్వోత్తమత్వమును తెలిసికొనవలసినది.

వాయుర్హి బ్రహ్మతామేతి తస్మాద్బ్రహ్మైవ సస్మృతః
న బ్రహ్మసదృశః కశ్చిచ్ఛివాదిషు కథంచన॥ (II. 152)

వాయువు బ్రహ్మపదమును పొందును. గనుక అతను బ్రహ్మయేయని చెప్పబడును. శివుడు మొదలగువారిలో వాయువుకు సముడెవడును లేడు.

## శ్లాఘనీయములు.

(మహాభారత తాత్పర్యనిర్ణయములోనివి)

నిర్దోషపూర్ణగుణవిగ్రహ ఆత్మతంత్రో
నిశ్చేతనాత్మకశరీరగుణైర్విహీనః
ఆనందమాత్రకరపాదముఖోదరాదిః
సర్వత్ర చ స్వగతభేదవివర్జితాత్మా॥
కాలాచ్చ దేశగుణతోస్య న చాదిరంతో
వృద్ధిక్షయౌ న తు పరస్య సదాతనస్య
నైతాదృశః క్వచ బభూవ న చైవ భావ్యో
నాస్త్యుత్తమః కిము పరాత్పరమస్య విష్ణోః॥
సర్వజ్ఞ ఈశ్వరతమః స చ సర్వశక్తిః
పూర్ణావ్యయాత్మబలచిత్సుఖవీర్యసారః
యస్యాజ్ఞయా రహితమిందిరయా సమేతం
బ్రహ్మేంద్రపూర్వకమిదం స తు కస్య చేశం॥ (I. 11-13)

భగవంతుడు దోషరహితమగు నట్టియు, గుణపూర్ణమయినట్టియు రూపముకలవాడు. స్వతంత్రుడు. జడమగు శరీరము గుణములు లేనివాడు. ఆనందమే కరచరణాద్యవ

యవములు గాగలవాడు. తనరూపమందును, గుణమందును భేదము లేదు. కాలము వలనదే శమువలన, గుణములవలనను, ఆద్యంతములు లేనివాడు. సనాతనుడగు నితనికి వృద్ధిక్షయము లు లేవు. ఇట్టివాడీ సరికిలేడు. ముందుగలుగబోడు. పరాత్పరుడగు నితనికన్న నుత్తము డెటులగలుగును ? ఇతను సర్వజ్ఞుడు, పరమేశ్వరుడు, సర్వశక్తుడు, పూర్ణమయినట్టి యు, నవ్యయమయినట్టియు, బలము, జ్ఞానము, ఆనందము, వీర్యము సారముగాగలవాడు ఇతనియాజ్ఞ లేనిది రమా బ్రహ్మేంద్రాదులేమియును చేయలేరు.

మాహాత్మ్యజ్ఞానపూర్వస్తుసుదృఢః సర్వతోఽధికః
స్నేహోభక్తిరితిప్రోక్తస్తయా ముక్తిర్నచాన్యథా॥ (I. 86)

(పైనిచెప్పినప్రకారము) భగవంతుని మాహాత్మ్యమును తెలిసినట్టియు, ఎప్పటికి దృఢముగా నుండునట్టియు, తక్కినయన్నిటికంటె నధికమయినట్టియు, స్నేహము భక్తి యని చెప్పబడును. ఇట్టిభక్తివలననే ముక్తి కలుగును కాని మరియొకలాగున కాదు.

అచ్ఛిద్రసేవనాచ్చైవ నిష్కామత్వాచ్చ యోగ్యతః
ద్రష్టుంశక్యోహరిః సర్వైర్నాన్యథాతుకథంచన॥ (I. 98)

యోగ్యతానుసారముగా, నిరంతరమయినట్టియు, నిష్కామమయినట్టియు సేవవల న భగవంతు డందరిచేతను కనుగొనబడును. మరియొక విధముగా కనుగొనబడదు.

దానతీర్థతపోయజ్ఞపూర్వాస్సర్వేపిసర్వదా
అంగానిహరిసేవయాం భక్తిస్త్వేకావిముక్తయే॥ (I. 100)

దానము, తీర్థయాత్ర, తపస్సు, యజ్ఞము, మొదలగున వన్నియు నెప్పుడును హరిసేవయొక్క అంగములు. భక్తియొకటియే ముక్తిసాధనము.

నహిభాగవతోధర్మోదేవతాభ్యఃప్రయాచనం।
జ్ఞానభక్తీహరేస్తృప్తింవినావిష్ణోరపిక్వచిత్॥ (13-3)

దేవతలను యాచించుట భగవద్భక్తుల ధర్మముకాదు. విష్ణువునైనను. జ్ఞానము, భక్తి, భగవత్ప్రీతి, వీనినితప్ప మరిదేని నెప్పుడును కోరకూడదు. (దేవతలను కోరకూడదని వేరుచెప్పనేల ?)

(అనువ్యాఖ్యానం.)

సోపాసనాచద్వివిధాశాస్త్రాభ్యాసస్వరూపిణీ
ధ్యానరూపపరాచైవయస్యాంగంధారణాదికం॥

ఉపాసన రెండువిధములు, శాస్త్రాభ్యాసము, ధ్యానమునని ధారణమొదలగునవి. ధ్యానముయొక్క అంగములు,

ప్రతీకవిషయత్వేనన కార్యావిష్ణుభావనా।
ప్రతీకం నైవవిష్ణుర్యన్మిథ్యోపాసాహ్యనర్థదా॥

ప్రతిమ విష్ణువుగా ఎంచబడకూడదు ప్రతిమయెప్పటికిని విష్ణువుకానేరదు. (ప్రతిమ విష్ణువను) మిథ్యోపాసన యనర్థమునిచ్చును.

(బ్రహ్మసూత్రభాష్యం.)

సచ్చిదానందఆత్మేతిబ్రహ్మోపాసావినిశ్చితా
సర్వేషాంచముముక్షూణాంఫలసామ్యాదపేక్షితా॥ (III. 3-12)

మోక్షేచ్ఛగల యందరిచేతను సచ్చిదానందాత్మయని బ్రహ్మోపాసన చేయబడవలెను. ఇట్టి యుపాసన యనుగుణమగు ఫలమునిచ్చును గనుక నిది అపేక్షించ బడినది.

ముక్త్యర్థమాత్మయోగ్యంహికార్యమేవహ్యుపాసనం
నృసింహాదికమన్యచ్చదురితాదినివృత్తయే॥
ఉపాసతేయథాయోగంనవాఫలవిభేదతః॥ (III. 3-61)

ముక్తికొరకు తనకు యోగ్యమగు నుపాసన చేయబడ వలయును. పాపపరిహారము కొరకు నృసింహాది (అవతార) రూపములను పాసింతురు. కొందరు పాసించరు. ఏలననగా వారియుద్దేశములు వేరుగానుండును. (తమకు యోగ్యమగు నుపాసనమునసే పాపపరిహారము మొదలగునవి కలుగును. ఇట్టి ముఖ్యోపాసనకు నృసింహాది రూపోపాసన అడ్డుచేయవచ్చునను తలంపులో కొందరు నృసింహాది రూపోపాసన చేయరని తాత్పర్యము.)

పూర్వస్మాదుత్తమోలబ్ధః స్వయమేవగురుర్యది
గృణ్హాయాదవిచారేణవికల్పః సమయోర్భవేత్॥ (III. 3-46)

మొదటి గురువుకన్న నుత్తమగురువు లభించిన యెడల నాలోచించక ఉత్తమగురువు నవలంబించవలెను. సముడగు గురువు లభించిన యెడల నేగురువునైన నవలంబించవచ్చును.

తంత్రసార సంగ్రహం.

ఉత్తమాదుత్తమాసిద్ధిర్ధర్మమోక్షాదిషుస్ఫుటం
తస్మాదుత్తమఆచార్యేభ్యలనాతోవరంవ్రజేత్॥

ఏకస్యశిష్యతాంప్రాపత్యదాజ్ఞాంనవినాసమం
అవరంవావ్రజేదుచ్చగుణశ్చేన్నైవదుష్యతి
విశేషతోగుణశ్చస్యాద్దేవేష్వప్యేవమేషహి॥ (III. 142-143)

ధర్మమోక్షాదులం దుత్తమగురువువలన నుత్తమసిద్ధి కలుగును. కావున నుత్తమగురువు లభించినపు డతనికన్న తక్కువవాని వద్దకు వెళ్ళకూడదు. ఒకనికి శిష్యుడంయియతని యాజ్ఞలేక అతని సముడగురేక అతనికన్న తక్కువవాడగు గురువును పొందకూడదు. అతనికన్న నుత్తమగురువుదొరికినపుడు (అతని యాజ్ఞ లేకయే) ఉత్తమగురువును పొందుటయందు దోషము లేదు. విశేషముగా గుణముకూడ కలుగును. దేవతలయందు నిటులనేయున్నది.

కర్మనిర్ణయము.

నదేవాయష్టిమాదాయరక్షంతిపశుపాలవత్ ।
యంతురక్షితుమిచ్ఛంతిబుద్ధ్యాసంయోజయంతితం॥
(భారతం ఉద్యోగపర్వం విదురనీతి.)

దేవతలు పశువుల కాపరులవలె కర్రపట్టుకొని రక్షించరు. ఎవనిని రక్షించ నిశ్చయింతురో వానిని బుద్ధితో కూర్చుదురు.

పైమూడు శీర్షికలక్రింద వ్రాయబడిన వాక్యములలో ద్వైతసిద్ధాంతములోని విశేషాంశములు కొంతవరకు వివరించబడినవి. ఇకనీసిద్ధాంతమెటుల మనకు లాభకరముగునో యాలోచించవలసియున్నది :—

ద్వైతసిద్ధాంతము :—వ్యవహారములలోనైన నీసిద్ధాంతము నందరు నంగీకరించినదియే. పరమార్థ దశయందు ద్వైతముండునా యద్వైతముండునాయనునది ఆత్మపరోక్షమయినప్పుడు కాని తెలియదు. "భిద్యతేహృదయగ్రంధిశ్ఛిద్యంతేసర్వసంశయాః । క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే" యను ముండకోపనిషత్తులోని వాక్యానుసారముగా నిట్టియపరోక్షమయినపుడే విషయమయిన సంశయములు నివారణయగును. "నీవు" "నేను" అనుమాట లున్నంతవరకు నందరును ద్వైతులే.

భక్తి :—ఇదియే మోక్షసాధనమనియు, తక్కిన దానాదులన్నియు భగవత్సేవ యొక్క అంగములనియు చెప్పబడినది. భక్తియొక్క నిర్వచనము చూచిన జ్ఞానవైరాగ్యములతో కూడిన స్నేహమే భక్తియని స్పష్టపడును. ఉపాసనామార్గమతి శ్లాఘనీయముగా చెప్పబడినది. ఇట్టిభక్తి యందరిచే నవలంబించ బడవలసినదే :—

" సత్యపిభేదాపగమేనాథతవాహంనమామకీనస్త్వం।
సాముద్రోహితరంగః క్వచనసముద్రస్తారంగః "

భేదము లేక పోయినను, నేను నీవాడనుకాని నీవు నావాడవుకావు. తరంగము సము ద్రముది కాని సముద్రము తరంగముది కాదు అని చెప్పువాక్యమువలన నద్వైతులకును భ క్తిమార్గ మవలంబనీయమే.

<u>విష్ణుసర్వోత్తమత్వము</u> :—విష్ణురూపమునే సర్వోత్తమముగా నేలగ్రహించ వలయునని యడిగిన " వేదేరామాయణేచైవ పురాణేభారతేతథా । ఆదావంతేచమధ్యే చవిష్ణుః సర్వత్రగీయతే " అను హరివంశవాక్యానుసారముగా దేశమంతట నందరిచేతను పూజింపబడు రామాయణ, భారత, భాగవతగ్రంథములు విష్ణువు నధికముగా చెప్పుట యే దీనికి కారణము త్రిమూర్తులలో విష్ణువు సత్త్వప్రధానుడని పురాణములు చెప్పుచు న్నవి. గుణములలో సత్త్వగుణము గొప్పది. రజోగుణప్రధానుడు బ్రహ్మ, తమోగుణప్ర ధానుడు రుద్రుడునని యాపురాణములే చెప్పుచుండుటవలన సత్త్వగుణప్రధానుడగు వి ష్ణువుయొక్క ఉత్తమత్వము చెప్పబడినది :—

<u>వాయుజీవోత్తమత్వము</u> :—" నమస్తేవాయోత్వమేవప్రత్యక్షంబ్రహ్మాసి " యని తైత్తిరీయోపనిషత్తు చెప్పుటవలన వాయువే మనకు కనబడు బ్రహ్మయని స్పష్టమగుచు న్నది. వాయువు మనకెటుల కనబడుచున్నాడు ? స్పర్శమువలన ఇటులనే మానసిక స్ప ర్శవలన భగవంతుడు కనబడుచున్నాడు. ఇందుకు వాయువు నిదర్శనముగనుక వా యువుద్వారా మనము భగవంతుని కనుగొనుట కాధారుడై వాయువు మోక్షసాధకుడ గుచున్నాడు. " ఆకాశాద్వాయుః " అనువాక్యము ఆకాశరూపమగు పరబ్రహ్మనుండి వాయువు మొదట పుట్టినట్లు చెప్పుచున్నది.

<u>తారతమ్యము</u> :—ఈసిద్ధాంతమువలన నితరదేవతలయందలి ద్వేషభావములేదు. ఈతారతమ్యానుసారముగా బ్రహ్మకన్న శివుని తక్కువగా చెప్పుట కొందరికిష్టము లేక పోవచ్చును. కాని ఈతారతమ్యము యుక్తియుక్తముగా నున్నది. మనశరీరములో హృ దయము, శ్వాసకోశము, మెదడు ననునవి చైతన్యమునకు ముఖ్యాధారములు. మెదడు పనిచేయక పోయినను పిచ్చివానివలె, సన్నిపాతముచేసినవానివలె జీవించవచ్చును. శ్వా సకోశము కొంతకాలము పనిచేయకపోయినను జీవించవచ్చును. ఊపిరి బిగబట్టి కొంత కాలముండగలుగుటయు, నీళ్ళలో మునిగినవానికి తిరిగి శ్వాసవచ్చు నుపాయములు చే యుటయు నిందుకు నిదర్శనములు. హృదయము రక్తప్రవాహమున కాధారము. హృ

దయవ్యాపారము! నిలిచినతోడనే జంతువు మృతిని చెందును. ఇందువలన మెదడుకన్న శ్వాసకోశము, శ్వాసకోశముకన్న హృదయము నధికమయినవి. మెదడగు మనస్సుకు అభిమాని రుద్రుడని పురాణములు చెప్పుచున్నవి. శ్వాసకోశమున కాధారము వాయువు. ఈవాయువే బ్రహ్మయగునని చెప్పుటవలన శ్వాసకోశము బ్రహ్మయొక్క స్థానముగా చెప్పవచ్చును. హృదయము నారాయణపరముగా గీతాభాష్యమందు (8. 12) చెప్పబడినది. గనుక రుద్రునికన్న వాయువులేక బ్రహ్మ, వీరికన్న విష్ణువు నుత్తముడనినూచించబడినది. గుణములలో, తమోగుణముకన్న రజోగుణము, దీనికన్న సత్త్వగుణము నుత్తమములని పురాణములలో చెప్పబడినవి. గనుక నీతారతమ్యము యుక్తియుక్తముగానున్నది. ఈత్రిమూర్తులు నిజముగనున్నారా, ముక్తియందు నీతారతమ్యముండునా యనునవి అపరోక్షజ్ఞానవిషయములు.

అవతారములు :—అవతారసిద్ధాంతచరిత్రము వివరించుటకిక్కడ అవకాశము లేదు. మధ్వాచార్యులవారు తామవతారపురుషులమనే ఒకకారణముచేతనే వారిమతమును స్థాపించినయెడల వారు ముప్పదియేడు గ్రంథములు వ్రాయవలసిన యవసరము లేదు. వారిసిద్ధాంతమే మనకు ప్రధానము. జీవోత్తముడగు వాయువుయొక్క బ్రహ్మచర్యాశ్రమమునకు హనుమంతుడు, గృహస్థవానప్రస్థములకు భీముడు, సన్యాసమునకు, మధ్వాచార్యులును నిదర్శనములుగా మనము భావించవచ్చును. వాయు, హనుమ, భీమ, మధ్వాంతర్గతములగు మాధవ, రామ, కృష్ణ, వేదవ్యాసరూపములలో మాధవరూపము ప్రకృతిని నియమించురూపము, రామరూపము రామాయణముల ద్వారా, వ్యాసరూపము "కార్ష్ణంవేదం" అని చెప్పబడు మహాభారతము ద్వారా, కృష్ణరూపము భాగవతపురాణముల ద్వారా, మనకు జ్ఞానము కలుగచేయు భగవద్రూపములు నని మనము సమన్వయచేసికొనవచ్చును. "ఆచార్యదేవోభవ" గురువును దైవముగా భావింపుమని శ్రుతిచెప్పుట వలన గురువు దైవస్వరూపముగాని యవతారపురుషుడుగాగాని భావింపబడినటుల సమన్వయమవును.

శాశ్వతనరకము :—ఈసిద్ధాంతమునకు భగవద్గీతలలోని యీక్రిందిశ్లోకములాధారముగా కనబడుచున్నవి:—

అహంకారంబలందర్పంకామంక్రోధంచసంశ్రితాః
మామాత్మపరదేహేషుప్రద్విషంతోభ్యసూయకాః
తానహంద్విషతః క్రూరాన్ సంసారేషునరాధమాన్

తేషాం పాప్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥
ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిం॥ (16-18-20)

అహంకారము, అసూయ మొదలగు భావములతో కూడిన భగవద్ద్వేషులకు సద్గతి లేదని పై శ్లోకముల యభిప్రాయము. ఈ యభిప్రాయమున కనుగుణముగా శాశ్వతనరక సిద్ధాంతమును సమన్వయము చేయవచ్చును.

ఇట్టి సమన్వయము చేయుటకు నాచార్యులవారి వాక్యము లాధారములుగా నున్నవి :—

విష్ణ్వాధిక్యవిరోధీనియాని వేదవచాంస్యపి
తాని యోజ్యాన్యానుకూల్యాద్విష్ణ్వాధిక్యస్య సర్వశః॥ (I. 36)

విష్ణుసర్వోత్తమత్వమునకు విరోధముగా నుండు వేదవాక్యములైనను విష్ణుసర్వోత్తమత్వమున కనుకూలముగా సమన్వయము చేయబడవలయునని మహాభారత తాత్పర్యనిర్ణయమందును.—

బహుషు గ్రంథేషు నిషేధః కుత్రచి దేవ తదుక్తిరితి విశేషః......
అయుక్తిమద్భ్యో యుక్తిమంత్యేవ బలవంతి వాక్యాని......
సామ్యేపి వాక్యయో ర్లోకానుకూలమేవ బలవత్ ......(9-10 & 11)

అనేక గ్రంథములయందు (ద్వేషమువలనముక్తి) నిషేధించబడినది. ఎక్కడనో అది చెప్పబడినది, యుక్తి లేని వాక్యములకన్న యుక్తియుక్తములగు వాక్యములే బలవంతములు రెండువాక్యములు సమముగా (యుక్తి కలిగి) యున్నప్పటికి లోకానుకూలమగు వాక్యమే బలవంతము. అని గీతాభాష్యమందును, చెప్పబడియున్నందున యుక్తికిని, లోకమునకును ననుకూలములగునట్టులనే సిద్ధాంతమును సమన్వయము చేయవలయును.

సర్వైశ్చ వైదికపదై రథ లౌకికైశ్చ
మేఘాగ్ని వారిధి తిలాదిరవైస్సమస్తైః
ఏకోభిధేయపరిపూర్ణగుణః ప్రియోలం॥

అని ఐతరేయ భాష్యాంతమందుండుటవలన వైదికములు లౌకికములునగు సమస్తపదములు. మేఘధ్వనులు మొదలగుధ్వనులును, గుణపూర్ణుడగు శ్రీకృష్ణభగవంతుని తెలియచేయును. ఇందువలన నన్నిపదములు భక్తిసిద్ధాంతమునకు సమన్వయము కావలయునని తాత్పర్యము.

ఋగాద్యాశ్చచత్వారః పంచరాత్రంచభారతం
మూలరామాయణంబ్రహ్మసూత్రంమానవంస్వతః స్మృతం॥ (I. 30)
వైష్ణవానిపురాణానిపంచరాత్రాత్మకత్వతః
ప్రమాణాన్యేవమన్వాద్యాః స్మృతయోవ్యనుకూలతః॥ (I. 32)
మోహార్థాన్యన్యశాస్త్రాణి......అతస్తైషూక్తమగ్రాహ్యం.....
(I. 34)

నాలుగువేదములు, పంచరాత్రము, భారతము, మూలరామాయణము, బ్రహ్మసూత్రములును, స్వతఃప్రమాణములు, విష్ణుసంబంధమైనపురాణములు, పంచరాత్రమువంటివిగనుక నవియును, మనుస్మృతిమొదలగు స్మృతులును ప్రమాణములే, తక్కినశాస్త్రములు మోసపుచ్చుటకు చెప్పబడినవి. వానియందు చెప్పబడినది గ్రహింపబడగూడదు. అని మహాభారతతాత్పర్య నిర్ణయమందు చెప్పబడి యుండుటవలన సిద్ధాంతమునకు సమన్వయముకాని వాక్యములు, గ్రంధములును విడువబడవలసినదని తాత్పర్యము.

ఇట్టి సమన్వయమును తక్కినవారును చేసినందుకునొక నిదర్శనమీక్రింద కనుపరుచబడును.

పౌరాణిక భూగోళానుసారముగా భూమి పద్మమువలెనున్నది. దానిమధ్యకర్ణికవలె మేరుపర్వత ముత్తరదిక్కున నున్నది. మేరువుచుట్టు సూర్యుడు తిరుగుటవలన రాత్రి పగళ్ళుకలుగుచున్నవి భూమిని శేషుడు, అష్టదిగ్గజములు మొదలగునవి మోయును. రాహుకేతువులు, సూర్యచంద్రులయందు విద్వేషమువలన వారినిపట్టుకొనగాగ్రహణములు కలుగును. దీనిని ఖండించి భాస్కరాచార్యులు తమసిద్ధాంతశిరోమణి (గోళాధ్యాయము) లోనిటులవ్రాసిరి.

యదిసమాముకురోదరసన్నిభాభగవతీధరణీతరణిఃక్షితేః
ఉపరిదూరగతోపివరిభ్రమన్కిమునరైరమరైరివనేక్ష్యతే।
యదినిశాజనకః కనకాచలః కిముతదంతరగః ననదృశ్యతే।
ఉదగయంననుమేరురథాంశుమాన్ కథముదేతిచదక్షిణభాగకే॥
మూర్తోధర్తాచేద్ధరిత్ర్యాస్తతోన్య స్తస్యాప్యన్యస్యైవమత్రానవస్థా।
అంత్యేకల్ప్యాచేత్స్వశక్తిః కిమాద్యే
కిన్నోభూమేస్సాష్టమూర్తేశ్చమూర్తిః॥
భూమేః పిండః శశాంకజ్ఞకవిరవికుజేజ్యార్కినక్షత్రకక్షా

వృత్తైవృత్తోవృతస్సన్మృదనిలసలిలవ్యోమ తేజోమయోయం
నాన్యాధారః స్వశక్త్యైవవియతినియతంతిష్ఠతీహాస్యపృష్ఠే।
నిష్ఠంవిశ్వంచశశ్వత్సదనుజమనుజాదిత్యదైత్యంసమంతాత్ ॥
సర్వతః పర్వతారామగ్రామచైత్యచయైశ్చితా।
కదంబకుసుమగ్రంథిః కేసరప్రకరైరివ॥
తిథ్యాం తేచేద్గ్రహాఉడుపతేః కిన్న భానోస్త దాసీం।
ప్రాచ్యామిందోర్భగణపతితరణేః ప్రగ్రహాః కింప్రతీచ్యాం॥

భూమిసమముగా నున్నయెడల పయినతిరుగుచున్న సూర్యుడందరికి నెప్పుడును క నుబడుచుండ వలయును. మేరువుసూర్యునికడ్డము వచ్చుటవలన రాత్రికలిగినయెడలనడ్డము వచ్చిన యా మేరువు మనకేలనపడదు? మేరువు పర్వతముత్తరదిక్కున నున్నదికదా, సూర్యుడు (దక్షిణాయనములో) దక్షిణదిక్కున నేటులనుదయించును? భూమిని మోయు రూపమొకటి యున్నయెడల దానిని మోయునది మరియొకటి యుండవలయును. ఇటులన న వస్థవచ్చును. తుదకుస్వశక్తివలన నొకటి (మోయునది) యున్నదని చెప్పేయెడల అస్వశక్తి మొదట భూమికే యేల చెప్పకూడదు? భూమి గోళాకారముగా రెండవ యాధారము లేకయే తన స్వశక్తివలన నాకాశమందున్నది. దీనిచుట్టును చంద్రుడు మొదలగు గ్రహములు, నక్షత్రములు నున్నవి. కదంబపుష్పమునకు కేసరములున్నటుల భూమిచుట్టును పర్వతములు మొదలగునవి యున్నవి. చంద్రగ్రహణము పూర్ణిమయందుకాగా అరోజు సూర్యగ్రహణ మేలకలుగకూడదు? చంద్రగ్రహణము తూర్పుదిక్కునుంచియు, సూర్యగ్రహణము పశ్చిమదిక్కునుంచియు నేలకలుగవలయును? (అందువలన రాహుకేతువులవలన గ్రహణములు కలుగలేదని యభిప్రాయము) ఈరీతినాక్షేపించిన భాస్కరాచార్యులే గ్రహణముల నిటుల సమన్వయముచేసెను.

రాహుః కుభామధ్యగతః శశాంకం
శశాంకగశ్ఛాదయతీనబింబం।
తమోమయః శంభువరప్రసాదాత్
సర్వాగమానామవిరుద్ధమేతత్ ॥

రాహువు భూచ్ఛాయయందు ప్రవేశించి చంద్రుని, చంద్రునియందు ప్రవేశించి సూర్యుని నష్టగించును వీనుల మోహమయుడు. వీనికి బ్రిహ్మవరము కలదు. అనిచెప్పినయెడల

సర్వశాస్త్రములకు విరుద్ధములేకయుండునని భూఛాయవలన చంద్రగ్రహణము చంద్రు
డడ్డము వచ్చుటవలన సూర్యగ్రహణమును కలుగునను జ్యోతిస్సిద్ధాంతము పౌరాణిక సి
ద్ధాంతముతో సమన్వయము చేయబడెను.

ఇందుపైని, ఇట్టిసమన్వయముల వలన యథార్థదృష్టిపోయి మనబుద్ధిక్షీణించు
ననియు, పూర్వాచారపరాయణులకు విరుద్ధముగా చెప్పినయెడల వారునిందింతురు లేక
బాధింతురను భయముతో మనపూర్వులిట్టి సమన్వయములు చేసినను చేసియుండవచ్చును.
కానియట్టిబాధలు లేని యీకాలములోనిట్టి యవసరములు లేవనియు సహజముగా నాక్షేప
ణరావచ్చును. ఈయాక్షేపణనిజముగా నిరుత్తరమైనదియే కాని యిట్టిసమన్వయము చేయు
టలో మనపూర్వుల ముఖ్యోద్దేశ మేమియో మనము యోచించవలసి యున్నది.

స్వధర్మాచరణము, లోకానుకూలత లేక లోకసంగ్రహము నార్యమత ముఖ్యోద్దేశ
ములు ఆర్యధర్మసంబంధమగు ప్రతికర్మకును స్నానముదానమును ప్రధానాంగములు
స్నానమువలన బాహ్యశౌచము. దానమువలననంతఃశౌచమును తెలియచేయబడినవి. "స
ర్వేషామేవశౌచానా మర్థశౌచం పరంస్మృతం, యోర్థే శుచిః సశుచిర్న మృద్వారి
శుచిః శుచిః"! అన్నిశౌచములలోను ధనసంబంధమగు శౌచమే ముఖ్యశౌచము.
ధనము విషయము శుచిగలవాడే శుచియనబడును కాని కేవలముమన్ను పూసికొని స్నానము
చేసినంత మాత్రమున శుచికానేరడని మనుస్మృతి చెప్పుచుండుటవలన మనమిప్పుడు చే
యు స్నానదానములు మనకునిజమైన శౌచమునుకలుగచేసిననే యవిలాభకరమగును.
కాని మనయారోగ్యమునకును, జ్ఞానమునకును ప్రతిబంధము కలుగచేసినయెడల నవిలా
భకరములు కానేరవు. ఆచారమను పేరుతో మనమొకదారమును చూచినతోడనే పా
మునుచూచినటులనే భయపడుటయు, దానిని తాకినతోడనే స్నానముచేయుటయు,
"నార్ద్రవాసాఃకదాచన" తడిబట్టతో నెప్పుడునుండకూడదనిశాస్త్రము చెప్పుచున్నను
తడిబట్టతోనే యుండుటయు పాత్రాపాత్ర విమర్శనములేక ద్విజబంధువు డనగానే
వానికి దానము చేయుటయు, దేవునిలోభిగానెంచి లంచము నిచ్చురీతిని మొక్కుబలు
లు మొదలగునవి నిచ్చుటయు, న్యాయాన్యాయముల విచారించక విమార్గమునయిన ధన
ము నార్జించుటయు నిజమగుశౌచములు కానేరవు. ఇట్టిపిచ్చి శౌచములుకాని నిజమగు
శౌచముకొరకు మనపూర్వులు దేశకాల పాత్రముల నేర్పరిచిరి.

జ్ఞానులసేకులు చేరుస్థలములుపవిత్రస్థలములు వీరుసమావేశమగుటకుప్రకృతియందు
భగవన్మహిమనుసూచనచేయుపూర్ణిమ, అమావాస్య,గ్రహణములుమొదలగునవితిథనకా

లమునలుగా యేర్పరచబడినవి. గౌరవభావముతో నిట్టిజ్ఞానములును, కనికరభావముతో బీదలు వికలాంగులు మొదలగువారును దానపాత్రులు. సజ్జన సహవాసమువలన జ్ఞానము కలిగి మనము బాగుపడుటకే దేశకాలములు నియమింపబడినవి. మనస్సు నిర్మలముగా నున్నప్పుడు దేశకాలవ్యవస్థ యక్కఱలేదని ఈక్రిందిశ్లోకములు చెప్పుచున్నవి.

తమేవ దేశం సేవేత తం కాలం తామవస్థితిం
తానేవ భోగాన్ భుంజీత మనో యత్ర ప్రసీదతి
నహి దేశాదిభిః కశ్చిద్విశేషః సముదీరితః
మనఃప్రసాదనార్థం హి దేశకాలాదిచింతనం (బ్రహ్మసూత్రభాష్యం)

మనస్సే ప్రధానమైనను దేశకాలములు మనస్సుయొక్క నిర్మలత్వమునకు కారణమగునని యును పైశ్లోకముల యభిప్రాయము. ఈదేశకాలవ్యవస్థ మనస్సును నిర్మలముచేయనప్పుడు వ్యర్థమగును. జ్ఞానుల నొక్కచోట చేర్చుటయే యీదేశకాల వ్యవస్థయొక్క ముఖ్య సార్థక్యము:—

ఇటుల చేరుటకు జ్ఞానులునజ్ఞానులు నొకతిరుగతిలోనే యుండజేరరు గనుక అజ్ఞానులకామోదముగానుండునటుల జ్ఞానులుసంచరించుట తటస్థించుచుండును. "నబుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం। జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్" అజ్ఞానులు బుద్ధిభేదము వలన చెడిపోక నుండునటుల చూచుట జ్ఞానుల ముఖ్యకృత్యమని భగవద్గీత చెప్పుచుండుటవలన నుద్దేశభేదముతో నజ్ఞానులు చేయు గ్రహణ స్నానదానాదులనే జ్ఞానులును చేయుచుందురు. ఇందుకొరకు వాక్యముల సమయన్వయము కావలసి వచ్చును.

నిజమయిన శాస్త్రోద్దేశము తెలిసిన జ్ఞానులలోనైనను రుచిభేదముండక మానదు.

యదంఘ్ర్యభిధ్యానసమాధిధౌతయా
ధియానుపశ్యంతిహి తత్త్వమాత్మనః
వదంతి చైతత్కవయో యథారుచం
స మే ముకుందో భగవాన్ ప్రసీదతాత్ ॥

భగవద్భక్తిచే నిర్మలమయిన మనస్సుతో తత్త్వమును కనిపెట్టి దానిని రుచిననుసరించి జ్ఞానులు చెప్పుదురని భాగవతమందుండుటవలన జ్ఞానులలో నభిప్రాయభేదముండును, [illegible]ముకే భారతములోని ఈక్రిందివాక్యము బలపరచుచున్నది:—

తర్కోఽప్రతిష్ఠః శ్రుతయోవిభిన్నా
నైకోఋషిర్యస్యమతంప్రమాణం
ధర్మస్యతత్త్వంనిహితంగుహాయాం
మహాజనోయేనగతః సపంథాః॥

యుక్తికంతములేదు. శ్రుతులు పరస్పరభేదములుగా నున్నవి. ఒకఋషి మతము మరియొకఋషిమతముపోలియుండలేదు. ధర్మతత్త్వము కనుగొనుట కష్టము. మహాజనులు వెళ్ళినదే మార్గము.

స్మృతులు నిటులనే చెప్పుచున్నవి :—

వేదోఽఖిలోధర్మమూలంస్మృతిశీలేచతద్విదాం।*
ఆచారశ్చైవసాధూనామాత్మనోరుచిరేవచ॥ (మనుస్మృతి)
శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్యచప్రియమాత్మనః
సమ్యక్సంకల్పజఃకామోధర్మమూలమిదంస్మృతం॥
(యాజ్ఞవల్క్యస్మృతి)

శ్రుతిస్మృతులతో పాటు సదాచారమేకాక తనయొక్క మంచిసంకల్పము, ఇష్టముకూడ ధర్మము కాధారమని చెప్పుటవలన నభిప్రాయభేదము దృఢపరచబడినది.

శ్రుతియు నిటుల చెప్పుచున్నది :—

వేదమనూచ్యాచార్యోఽంతేవాసినమనుశాస్తి సత్యంవద।ధర్మంచర।
స్వాధ్యాయాన్మాప్రమదః ఆచార్యాయప్రియంధనమాహృత్యప్రజా
తంతుంమావ్యవచ్ఛేత్సీః సత్యాన్నప్రమదితవ్యం। ధర్మాన్నప్రమది
తవ్యం కుశలాన్నప్రమదితవ్యం। భూత్యైనప్రమదితవ్యంస్వాధ్యాయ
ప్రవచనాభ్యాంనప్రమదితవ్యం దేవపితృకార్యాభ్యాంనప్రమదితవ్యం।
మాతృదేవోభవ పితృదేవోభవ। ఆచార్యదేవోభవ అతిథిదేవో
భవ। యాన్యనవద్యానికర్మాణి తానిసేవితవ్యాని। నోఇతరాణి యా
న్యస్మాకంసుచరితాని। తానిత్వయోపాస్యాని...... అథయదితే
కర్మవిచికిత్సావావృత్తవిచికిత్సావాస్యాత్ యేతత్రబ్రాహ్మణాః సం
మర్శినః యుక్తాఆయుక్తాః అలూక్షాధర్మకామాఃస్యుః యథాతే
తత్రవర్తేరన్ తథాతత్రవర్తేథాః అథాభ్యాఖ్యాతేషు। యేతత్రబ్రా

ష్టాః సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః అలూక్షా ధర్మకామాస్స్యుః యథా తే తేషు వర్తేరన్। తథా తేషు వర్తేథాః ఏష ఆదేశః ఏష ఉపదేశః ఏషా వేదోపనిషత్ ఏతదనుశాసనం ఏవముపాసితవ్యం। ఏవముచైతదుపాస్యం॥

వేదాధ్యయనమయిన తరువాత నాచార్యుడు శిష్యునికుపదేశించుచున్నాడు సత్యము చెప్పుము ధర్మమునాచరింపుము స్వాధ్యాయమును మానకుము ఆచార్యునికొరకు అభీష్టమైనధనమునిచ్చి సంతానమును విచ్ఛేదము చేయకుము సత్యమువల్లను ధర్మమువల్లను ఆత్మరక్షణకొరకైన కర్మవల్లను, ఐశ్వర్యముకొరకైన మంగళయుక్తమగు కర్మవల్లను, స్వాధ్యాయ ప్రవచనములవల్లను, దేవపితృకార్యములవల్లను, ప్రమాదమునుపొందకుము. తల్లి దండ్రులను, గురువును, అతిథులను, దైవములుగా చూడుము. అనిందితములగు కార్యములను చేయుము నిందితములగు కార్యముల విడువుము......నీకు కర్మయందుకాని, ఆచరణయందుకాని సందేహము కలిగినయెడల సౌమ్యస్వభావులు, ధర్మకాములునగు బ్రాహ్మణశ్రేష్ఠులనడిగి తెలిసికొనుము. వారికిని సంశయముకలిగినపుడు వారు నట్టిబ్రాహ్మణశ్రేష్ఠులనడిగి నడుచుకొందురు. అటులనే నీవునడుచుకొనుము. ఇదియుపదేశము. (దీనివలన వేదశాస్త్రములను చదివినవారికిని ధర్మసందేహములుండునని తేలును)

శ్రుతి, స్మృతి, సదాచారములను తెలిసిన మంచిసంకల్పముగల మహాజనులు మనయభివృద్ధికి ననుగుణముగా నుండునటుల కొన్ని యేర్పాటులను చేసిరి. వీనికియమనియమములని పేరు :—

అహింసాసత్యమస్తేయంబ్రహ్మచర్యాపరిగ్రహా
యమాః। శౌచంతపస్తుష్టిః స్వాధ్యాయోహరిపూజనం
నియమాః..... (తంత్రసార.)

అహింసా, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, ననునవి యమములు. శౌచము, తపస్సు, తుష్టి, స్వాధ్యాయము, హరిపూజనము ననునవి నియమములు, భక్తిమార్గమందీ యమములీక్రిందిరీతిని చెప్పబడినవి :—

దయమాసర్వభూతేషుసంతుష్ట్యాయేనకేనచిత్
సర్వేంద్రియోపశాంత్యాచతుష్యత్యాశుజనార్దనః॥

సర్వభూతదయ, తనకు దొరికిన దానితో సంతోషము, ఇంద్రియనిగ్రహము భ

గోవంతుని త్వరగా సంతోషింపచేయు సాధనములుగా భాగవతమందు చెప్పబడినవి; ఇవియమములకు సరిపోవును. "స్నానం సంధ్యాజపో హోమః స్వాధ్యాయః పితృతర్పణం" అనునవి నియమములుగా మరియొకచోట చెప్పబడినవి. తంత్రిసారములోని నియమములు వీనిననుసరించియేయున్నవి. "యమానభీక్ష్ణం సేవేతనియమాన్ మత్పరః క్వచిత్" యమముల నెప్పుడును తప్పక సేవించవలయును. తరువాత నియమములను సేవించవలయునని చెప్పుటవలన నియమములకన్న యమములయాధిక్యత తెలియచేయబడినది. యమములు సర్వజన సామాన్యములయి యుక్తయుక్తములని (Universal or Rational) యు నియమములు దేశీయములని (National) యు చెప్పవచ్చును. యమములు మార్పును చెందవు. నియమములు దేశకాలానుగుణముగా మారుచుండును. ఇట్టిమార్పులను చేయువారు పైనివ్రాయబడిన వాక్యములలో చెప్పబడినశ్రుతి స్మృతిజ్ఞానము సమ్యక్సంకల్పము మొదలగు లక్షణములు కలవారుకావలెను. అట్టిలక్షణములు లేనివారేర్పరచిన వల్లభ, శాక్తేయ, పాశుపతాది మతములలోని బ్రహ్మచర్యాది యమములకు విరుద్ధములగు నియమములు నింద్యములగుచున్నవి. గనుక నియమములెప్పుడును యమములకు విరుద్ధముగా నుండకూడదు.

ఈయమనియమము లార్యధర్మమను కట్టడమునకు పునాదివంటివి. "తస్యైతపోదమః కర్మేతిప్రతిష్ఠా వేదాఃసర్వాంగాని సత్యమాయతనం" ఈబ్రహ్మవిద్యకు తపస్సు దమము. కర్మ, యనునవి పునాదివంటివి. వేదములు, వేదాంగములు, సత్యము ననునవి పైయాధారములని చెప్పుతలవకారోపనిషత్తులోని వాక్యమీయర్థమునే తెలియచేయుచున్నది. ఎన్నిమార్పులు కలిగినను, ఎన్నియుపద్రవములు వచ్చినను మనభరతఖండములో ఋగ్వేదము మొదలు నిప్పటివరకు గాయత్రీమంత్రము ద్విజత్వమునకాధారమయియుండుట యార్యధర్మముయొక్క పునాదిదిట్టముగా నున్నదని తెలియచేయుచున్నది. "సత్యం పరంధీమహి" అనుభాగవత వాక్యమీ యర్థమునే సూచించును—

ఈపునాదిని కాపాడుచు దీనిపైని మతగురువులు తమబుద్ధిననుసరించి "వ్యాసచిత్తస్థితాకాశా దవచ్ఛిన్నానికానిచిత్ అన్యేవ్యవహరంత్యే తాన్యూరీకృత్యగృహాదివత్" వ్యాసచిత్తమను అకాశమునుంచి వేరువేరుయిండ్లను ఏర్పరచి కట్టినటుల నేమతములున్నవని చెప్పుబ్రహ్మసూత్రభాష్య వాక్యరీతిని వివిధములగు మతములను గృహములను కట్టివానిలో తమగ్రంథములను నిక్షేపమునుంచిరి. ఈనిక్షేపములలో మధ్వసిద్ధాంత గ్రంథములను నిక్షేపము మనకు పారంపర్యాయముగా వచ్చినది. జన్మకలననే మనకు హక్కుగా

